# ఏ దేవునికి ఏ విధముగా దీపారాధన చెయ్యాలి ?

సేకరణ, సంకలనము

శతాధిక గ్రంథ సంకలనకర్త,జ్యోతిషశిరోమణి :

డా॥ ఆదిపూడి వేంకటశివ సాయిరామ్

B.Sc.,L.L.B, M.A.(jyothisham)



ప్రకాశకులు : ఫోన్ : 246 2565

మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదురుగా

కోటగుమ్మం, రాజమండ్రి - 533 101

కాపీరైట్ 2012 వెల : 50-00



ఏ దేవునికి ఏ విధముగా దీపారాధన చెయ్యాలి?



First Edition :

2008









రచన, సంకలన కర్త :

డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్

B.Sc.,L.L.B, M.A.(jyothisham)



4-7-84, కొరిటెపాడు, గుంటూరు - 7

ఫోన్ : (0863) 2353321

సెల్ : 9440262421





ప్రకాశకులు



మోహన్ పబ్లికేషన్స్

కోట గుమ్మం - రాజమండ్రి - 533 101



## మా మనవి

ఇది వరకు మేము ప్రచురించిన

**శ్రీ గణేశారాధన, నవగ్రహారాధన, శివారాధన, సుబ్రహ్మణ్యారాధన, హనుమదారాధన, శ్రీసాయిఆరాధన, శ్రీలక్ష్మీ ఆరాధన, నిత్యజీవితములో రుద్రాక్షలు, నిత్యజీవితములో నవగ్రహాలు, నిత్యజీవితములో సాలగ్రహములు, నిత్యజీవితములో నవరత్నాలు, నవగ్రహరెమిడీస్, నవగ్రహ వైభవము, నవగ్రహదర్శనమ్, శ్రీదేవీలీలామృతం**

అత్యద్భుతముగా ప్రశంసలు అందుకున్నవి అందుచే

డా॥ ఆదిపూడి సాయిరామ్‌గారి

**ఏదేవునికి ఏ విధముగా దీపారాధన చెయ్యాలి?**

అనే పుస్తక రాజమును అందించినాము, కావున ప్రతి ఒక్కరు ఇది పారాయణ చేయదగినది. చదవటానికి ఇచ్చినచో మళ్ళీ ఈ పుస్తకము తిరిగి మీ వద్దకు, రాదు అంతటి అమూల్య గ్రంథము.



## విషయసూచిక









## ఒక వత్తి దీపాన్ని వెలిగిస్తే కలిగే ఉపయోగాలు

- ఒక దీపాన్ని వెలిగించేవారు ఆదిత్యుడు పూజించటానికి ఇష్ట పడతారు.
- దీనిని శివుని ప్రతిరూపముగా చూస్తారు.
- మానసిక ధైర్యం ఎక్కువ.
- ఈ దీపము సూర్యుని స్వరూపముగా పూజిస్తారు. దీని వెలిగించుట వలన సూర్యగ్రహ అనుగ్రహ ప్రాప్తి పాత్రులగుదురు.
- మొండితనం ఎక్కు ఎక్కువగా ఉంటుంది.
- ఈ దీపారాధన వలన ఆధ్యాత్మిక శక్తులు వశమగును. ఆధ్యాత్మిక జీవితములో హిమాలయ శిఖరమంత ఎత్తు ఎదుగును.
- మాటతీరు ఎంతో స్పష్టంగా ఉంటుంది.
- మంత్రం-తంత్రప్రయోగములు త్రిప్పికొట్టబడును. ఆధ్యాత్మికాభివృద్ధి కనబడును.
- పూజచేసిన తరువాత మాట్లాడిస్తే వీరికి ఎక్కువ కోపం వస్తుంది.
- వీరికి ఎక్కువగా ఉష్ణ సంబంధ వ్యాధులు రాగలవు.
- దీనివలన పనిమీద ఆసక్తిపెరుగును. మనస్సులో భక్తి కలుగును.
- దీని వలన ఆర్థికముగా అందరికంటే ముందంజలో ఉండుదురు
- ముఖ్యముగా రాజులు, పరిపాలకులు, నాయకులు వెలిగించి అత్యద్భుత ఫలితములు పొందుతున్నారు.
- దీని వలన సిరి సంపదలు కలుగును. అంతేకాక ఉన్నతి నొందుదురు.



- దీనివలన బ్రహ్మహత్యాదోషము తొలగును. అంతేగాక ఇంద్రియ నిగ్రహము కలుగుతుంది.
- దీనివలన టి.బి,మరియు ఆస్మాలాంటి మొండి వ్యాధులను తగ్గిస్తుంది. అంతేగాక తలనొప్పి, కంటిసమస్య, లివర్ సమస్యలు తొలగును.
- ఏ పూజమందిరములో పూజించబడుతుందో సంపదలు తరలి వచ్చును. సమస్యలు తొలగిపోవును. ఇల్లు అష్టైశ్వర్యములతో తులతూగును.
- ఒక ముఖం కలిగిన దీపము పరమతత్త్వాన్ని బోధిస్తుంది. పర మత్త్వాన్ని పొందాలని కోరేవాళ్ళు దీనిని వెలిగించాలి. దీని దర్శనము కూడా దుర్లభమే.
- సహజముగా శివతత్త్వం దీని ద్వారా పొందవచ్చును.
- శివరాత్రి పర్వదినమునందు ఏకవత్తి పూజ చేసిన పరమశివుని సాక్షాత్తు పూజ చేసినట్లుగా భావించవలెను.
- దీపావళి పర్వదినమునందు రాత్రి 12గం॥లకు లక్ష్మీపూజతో ఏకవత్తి పూజ చేసిన సంపదలు తరలివచ్చును.
- ప్రతి సంవత్సరము చైత్ర మాసములో సోమవారం ఏకవత్తిని 108 ఎర్ర పువ్వులతో అర్చించవలెను.
- ఏకవత్తిని పూజించినచో పూర్తి విశ్వాసం, జ్ఞానసంపద, ఐశ్వర్యం కలుగు తుంది.
- దీపారాధన తప్పక చేయవలెను. పూజకు ముందు కుందిని శుభ్రము చేయవలెను.
- ముఖ్యముగా ఈ దీపారాధన దీపావళి పర్వదినమునందుచేస్తే మంచిది.

## రెండు వత్తుల దీపాలను వెలిగించడం వలన ఫలితాలు

- దీపాలను వెలిగించే వారి మనసు ఎప్పుడూ శాంతంగా, ప్రశాం తంగా ఉంటుంది.
- ఇది అర్ధనారీశ్వరతత్వాన్ని బోధిస్తుంది.
- భార్యాభర్తలు ఎప్పుడూ పోట్లాడుకోరు, విడిపోరు.
- ముఖ్యముగా గురుపూర్ణిమ, పర్వదినమునందుగాని దత్త జయంతినాడు గాని బ్రాహ్మీముహూర్త సమయములో వెలిగించ వలెను.
- దీపారాధన చేసేవారికి ఎప్పుడు మంచి తేజస్సు, కాంతి కలుగు తాయి.
- సాధారణ గురువారముగాని, శుక్రవారముగాని కార్తీకమాస ములోగాని ఉదయము 6గం॥నుండి 7గం॥ల లోపు వెలిగించ వలదు.
- తల్లికి ఆరోగ్యం ఎల్లప్పుడు బాగా ఉంటుంది. ఆలోచనాశక్తి ఎక్కువ
- శివాలయములో రుద్రాభిషేకం చేసే ముందర వెలిగించగలరు.
- ఇది చేయునప్పుడు శివపంచాక్షరీ మంత్రమును 11మార్లు జపించవలెను.
- దీని వలన ఆధ్యాత్మిక శక్తులు పొందుదురు.
- దీని వలన సంఘములో లౌకిక జీవితములో ఇరుగుపొరుగు వారితో సహజసిద్ధముగా మెలగగలరు.



- మనస్సు నిలకడ లేనివారు, పౌర్ణమి తిథియందు దీపారాధన చాలా శ్రేష్ఠం. వ్యాపారం చేయువారికి చాలా మంచిది.
- దీనినే బ్రహ్మస్వరూపము అంటారు.
- దీనినే "దేవి" స్వరూపముగాచూస్తారు. మరియు "యుగళ రూపము" అంటారు.
- దీనిని అర్ధనారీశ్వర స్వరూపముగా కార్తీకమాసములో పూజి స్తారు.
- దీనిని పాలిస్తున్నది చంద్రగ్రహము. కావున నీచ చంద్రుడు, చంద్రుడుపాపిగా ఉన్న జాతకచక్రములు కలవారు ఖచ్చితముగా వెలిగించవలెను.
- వ్యాపారాభివృద్ధి, గొప్పతెలివితేటలు సర్వపాపహరణకు, కామాన్ని జయించటం దీని వలన కలుగును.
- దీనివలన సంతాన ప్రాప్తి కలుగును. అనుకున్న కోరికలు నెరవేరును.
- దీనివలన ఏకాగ్రత మరియు ప్రేమానురాగములు కలుగును. అంతేగాక మనస్సుకు ప్రశాంతత చేకూరి సర్వకోరికలు నెరవేరును.
- జీవితములో ఒడుదుడుకులు తగ్గించును. గోహత్యాదోషము కూడా తొలగిపోతుంది. శాంతికి ఉపయోగపడుతుంది.
- ఇది శివభక్తులకు మనశ్శాంతిని, ఆధ్యాత్మికాభివృద్ధిని కలిగి స్తుంది. కుండలినీ శక్తిని మేలుకొలుపును.
- ఈ దీపారాధన వశీకరణకు సంబంధించినవి.
- గర్భిణీస్త్రీలు దీనిని దీపారాధన చేసినచో చాలా తేలికగా సుఖ ప్రసవము కలుగును.

## మూడు వత్తుల దీపాలు వెలిగించడం వలన కలిగే ఫలితాలు

- ఈ మూడు వత్తుల దీపాలను ఎక్కువగా అమ్మవారి ఆలయాల్లో, గురు వులు ముందు మాత్రమే వెలిగిస్తారు.
- ఇది త్రికాలాగ్నుల స్వరూపము.
- కుజదోషం ఉన్నవారు నాగదేవత ముందు మూడు దీపాలను వెలిగిస్తే కుజదోషం నివారణ కాగలదు.
- శివాలయములో అభిషేకము చేసి వెలిగించగలరు.
- బి.పి ఉన్నవారు వారి ఇంట్లో మూడు దీపాలను వెలిగిస్తే బి.పి తగ్గి సామాన్య స్థితికి వస్తుంది.
- ముఖ్యముగా దీనిని గురువారంనాడు ఉదయము 6గం॥ నుండి 7 గం॥ల లోపుగా వెలిగించగలరు.
- నిమ్మకాయల దీపాలను అమ్మవారి ఆలయాల్లో వెలిగిస్తే ఎటు వంటి ఫలం కలుగునో మూడువత్తుల దీపాలను గృహములో వెలిగిస్తే అటువంటి ఫలితము కలుగుతుంది.
- సాధారణముగా సుబ్రహ్మణ్యషష్ఠి, నాగపంచమి పర్వదినము లందు దీనిని వెలిగించవలెను.
- శ్రీ సరస్వతీదేవి ముందు మూడువత్తుల దీపాన్ని వెలిగిస్తే వారికి జ్ఞాపకశక్తి పెరుగుతుంది.
- శివ మంత్రము నయినాసరే 11మార్లు జపము చేయవలెను.
- రజస్వల దోషాలు ఉన్నవారు తమ కులదేవత ముందు మూడు వత్తుల దీపాలను వెలిగిస్తే ఆ దోషాలు తొలగును.



- దీని ద్వారా అగ్ని తృప్తి చెందుతుంది. స్త్రీ హత్యాదోషం దీనివలన తొలగిపోతుంది. హత్యాదోషం అగ్నిలో ఆహుతి అయి శివత్వం పొందు తుంది.
- మూడు వత్తుల దీపాలను సంతాన గోపాల స్వామి వారి ముందు వెలిగించి, పూజనుచేస్తే వారికి సంతానం కలుగును.
- దీని వలన సంపద తరలివచ్చును. దీని వలన అనేక వ్యాధులు దూరమగును. స్వచ్ఛమైన బ్రాహ్మణత్వము కలుగును.
- ఆత్మన్యూనత, సిగ్గుపడటం, భయపడటం పూర్తిగా తొలగి పోతాయి ముఖ్యముగా 108 వత్తులు వెలిగించినచో పూర్వజన్మ లలో పాపాలు తొలగిపోవును.
- జీవితములో అదృష్టమును తీసుకుని వచ్చును.
- 3 వత్తులను త్రేతాగ్ని స్వరూపముగాపూజిస్తారు.
- నీచకుజ,కుజదోషము కలవారు ఖచ్చితముగా వెలిగించగలరు.
- మూడు దీపములను బ్రహ్మ,విష్ణు,మహేశ్వర స్వరూపాలుగా భావిస్తారు.
- అహంకారము, ద్వేషము భావముల నుండి బయటపడి ప్రశాంత జీవ నము కొనసాగించుటకు వెలిగించవలెను.
- పూర్వజన్మ పాపములు తొలగించబడును. విద్యలలో ఉన్నతిని కలిగిం చును.
- జీవితములో ప్రతి పనికి అడ్డంకులు వెలిగించినచో అన్ని పనులు చక్కగా అడ్డంకులు లేకుండా జరుగును.
- దీనిని ధనముకొరకు వెలిగించెదరు ఆరోగ్యమునకు అభ్యుదయ మునకు ఉపయోగపడుతుంది. ధన ధాన్యసమృద్ధికొరకు దీనిని వెలిగిస్తారు.

- దీని వలన మంచి ఆరోగ్యము మరియు ఉన్నతవిద్య లభించును. అంతేగాక పరిశోధనలో ముందుకు వెళ్ళదలచినవారు దీనిని వెలిగించ గలరు.
- దీని వలన స్త్రీ హత్యాదోషము కూడా తొలగిపోతుంది.
- ముఖ్యముగా పచ్చకామెర్ల వ్యాధి వచ్చినవారు దీపారాధన తొలగిపోవును.
- దీని వలన స్థల తగాదాలు, వైధవ్యము, రక్తము విషపూరితము అగుట సర్పకాటు నుండి తప్పించుకొనగలరు.





## నాలుగు వత్తుల దీపాలను వెలిగిస్తే కలిగే ఫలితాలు

- సరస్వతీ అమ్మవారికి నాలుగు వత్తుల దీపాలను వెలిగించి అక్షరాభ్యాసంచేస్తే వారు మేధావులుగా మారతారు.
- ఇది బ్రహ్మదేవుని స్వరూపము
- విష్ణుసహస్రనామం పారాయణ చేస్తూ నాలుగువత్తుల దీపాలను వెలిగిస్తే వారికి పునర్జన్మ అనేది ఉండదు.
- సాధారణముగా బుధవారము ఉదయము 6గం॥ నుండి 7గం॥ లోపుగా వెలిగించవలెను.
- సూర్యనారాయణస్వామికి నాలుగు వత్తుల దీపాలను వెలిగించి ఆదిత్య హృదయాన్ని పారాయణ చేస్తే ఆరోగ్యము లభిస్తుంది.
- ముఖ్యముగా గురుపూర్ణిమ, దత్తజయంతి పర్వదినములందు బ్రహ్మీ ముహూర్త సమయములో వెలిగిస్తారు.



- సాలగ్రామాన్ని పూజిస్తూ నాలుగువత్తుల దీపాలను వెలిగిస్తారో వారికి విష్ణుమూర్తి అనుగ్రహము కలుగుతాయి.
- దీని వలన ముఖ్యముగా చదువుట, నేర్చుకొనుట చాలా తేలికగా అభ్యాసమగును అంతేగాక సముద్రపుటంచులదాక జ్ఞానము కొరకు పయనించును.
- తులసీమాతకు నాలుగు వత్తుల దీపాన్ని వెలిగించి పూజచేస్తారో స్త్రీలకు సౌభాగ్యము కలుగును.
- దీని వలన అపారముగా జ్ఞానము ఉత్తమ ఆరోగ్యము కలుగును. నరహత్య నుండి విముక్తి గొప్ప జ్ఞానం, సిరిసంపదలులభిస్తాయి.
- ధన్వంతరి స్వామికి నాలుగు వత్తుల దీపాన్ని వెలిగించి పూజ చేస్తారో వారికి అనారోగ్యము కలగదు.
- దీనివలన సంపద నుంచి ఆరోగ్యము కలుగును. మంచి తెలివి తేటలు కలుగును.
- దీని వలన పరిశోధనాత్మకత, తర్కమువాదన, ఆలోచనలో ఒక పరిశీలన బాగా పెరుగుతాయి.
- ముఖ్యముగా వ్యాపారస్థులకు దీని వలన వ్యాపారాభివృద్ధి కలుగును.
- దీనిని బ్రహ్మస్వరూపముగా భావిస్తారు. స్వయంబ్రహ్మ స్వరూపము.
- దీనిని పాలిస్తున్నది బుధగ్రహము కావున నీచ బుద్ధి గ్రహస్థితి, బుధగ్రహ పాపి అగువారు వెలిగించాలి.
- దీని వలన ఆరోగ్యము సంపద లభించును. గ్రహణశక్తికి మానసికరోగు లకు విద్యార్థులకు జ్ఞాపకశక్తికి ఉపయోగపడును.

- సంతానము లేని వారు దీనిని వెలిగించినచో సంతానము కలుగును.
- దీని వలన తెలివితేటలు సంతోషముగా కూడా కలుగును. ముఖ్యముగా దీనిని ఉపన్యాసకులకు వ్యాపారులకు పనికివస్తుంది.
- దీని వలన నరహత్యాదోషము తొలగిపోతుంది. అంతేగాక వశీకరణ, ఆకర్షణ పెరిగి లౌకికానందము అనుభవించుదురు.
- దీనిని పాలిస్తున్నది బుధగ్రహము కావున అతని మాటలో మాధుర్యము ఆకర్షణ పెరిగి పేరు ప్రఖ్యాతులు పెరుగును.
- ముఖ్యముగా విద్యార్థులు పరిశోధకులు, జ్యోతిషశాస్త్రవేత్తలు, గణితి శాస్త్రజ్ఞులు, ఆచార్యులు వెలిగించుట చాలా మంచిది.
- దీని వలన క్రొత్త విషయములు కనుగొనుట, తర్కించుట, స్పష్టముగా ఆలోచించుట కలుగును. దర్శన, స్పర్శన మాత్రమున నాలుగు వర్ణముల ఫలితము లభించును.
- ముఖ్యముగా దీని వలన మాటకు విలువ పెరిగి సంఘములో గౌరవము కలుగును. ధర్మార్థ కామమోక్షం ప్రసాదిస్తుంది.





## ఐదు వత్తుల దీపాలను వెలిగిస్తే కలిగే ఫలితాలు

- శ్రీ గురుదేవులకు ఐదు వత్తుల దీపాలను వెలిగిస్తే పనులన్నీ గురు దేవుల అనుగ్రహంతో తొందరగా జరిగిపోతాయి.
- ఇది పంచబ్రహ్మ స్వరూపము. దీనివలన పరమశివుడు ఆనందము పొందుతారు.
- శ్రీ దత్తాత్రేయ స్వామిముందు, ఐదువత్తుల దీపాన్ని వెలిగించి దత్తస్తోత్రం, దత్తస్తవము పారాయణచేస్తే గురుదోషాలు తొలగును.
- సాధారణముగా కార్తీక సోమవారములందు లేదా సోమవారం ఉదయం 6గం॥ నుండి 7గం॥ లోపుగా వెలిగించాలి.
- శ్రీ గాయత్రీదేవి ముందు ఐదువత్తుల దీపాన్ని వెలిగించి గాయత్రీ మంత్ర జపాన్నిచేస్తే వారికి అనుగ్రహం లభిస్తుంది.
- ముఖ్యముగా దత్తజయంతి, గురుపౌర్ణమి, శివరాత్రి పర్వదినము లందు వెలిగించుట చాలా శ్రేష్ఠం.
- గణపతి ముందు ఐదువత్తుల దీపాన్ని వెలిగించి గరికతో పూజచేసి బెల్లాన్ని పంచిపెడితే శుభకార్యాలు జరుగుతాయి.
- దీనిని బ్రాహ్మణులకు కార్తీకమాసములో సోమవారం వెలిగించినచో చాలా మంచిది.
- శ్రీ దత్తాత్రేయుల స్వామి ముందు గురువారంనాడు ఐదు వత్తుల దీపాన్ని వెలిగించి శనగపప్పు పాయసంచేసి నైవేద్యం పెట్టినచో వివాహ దోషాలు తొలగి వారికి పెళ్ళిఅవుతుంది.

- ముఖ్యముగా దీని వలన అన్ని విషయములలో విజయము సాధించును.
- రక్తపోటు మరియు గుండెనొప్పులకు సంబంధించిన వ్యాధులు పూర్తిగా తగ్గిపోవును.
- పసుపుతో చిన్న గౌరీదేవి బొమ్మను తయారుచేసి ఐదు వత్తుల దీపాన్ని వెలిగించి పెళ్ళికాని అమ్మాయిలతో పూజ చేయిస్తే త్వరలో వివాహం జరుగుతుంది.
- దీనిని కాలాగ్ని రుద్ర స్వరూపముగా భావిస్తారు.
- దీనిని శివ(రుద్ర) స్వరూపముగా భావిస్తారు
- దీనిని పంచముఖబ్రహ్మ స్వరూపముగా పూజిస్తారు.
- దీనిని పాలిస్తున్నది గురుగ్రహము, కావున నీచగురువు గ్రహస్థితి ఉన్నవారు గురుపాపి అగు జాతకచక్రములు కలవారు తప్పక వెలిగించవలెను.
- దీని వలన పాపపరిహారము అగును. అంతేగాక ప్రేమ కలవార గుదురు. మానసికశాంతి, శత్రుజయం కలుగుతుంది.
- దీని వలన రోడ్డు ప్రమాదముల నుండి కాపాడును. అంతేగాక గుండెనొప్పి వంటివి దరిచేరవు. పాముకాటు నుండి రక్షణ కలుగుతుంది.
- దీనివలన సకల కోరికలు నెరవేరును. అంతేగాక శత్రుజయము కూడా కలుగును. నిద్రలేమికి కూడా మంచిది.
- దీనివలన వ్యభిచారదోషం, అభక్ష్యభక్షణపాపం, బ్రహ్మహత్యా దోషము పూర్తిగా తొలగిపోతుంది.
- దీని వలన మోక్షాపేక్షకు దారితీయును. అన్ని కోరికలు నెర వేరును మరియు మలబద్ధకము నివారించును.



### ఆరు వత్తుల దీపాన్ని వెలిగించడం వలన కలిగే ఫలితాలు

- ప్రతిరోజు ఇంట్లో పార్వతిపరమేశ్వరుల ముందర ఆరు వత్తుల దీపాన్ని వెలిగించి పూజచేస్తే వారికి తప్పకుండా త్వరలో వివాహం కాగలదు.
- ఆరు వత్తులు దేవత కార్తికేయుడు, దీని వలన కార్తికేయులు ప్రసన్నుడు అవుతాడు.
- నటరాజస్వామి ముందు ఆరు వత్తుల దీపాన్ని వెలిగించి పూజను చేసి నర్తకిలకు కాళ్ళగజ్జెలను దానం చేసినచో సంగీతం, నాట్యం బాగా నేర్చుకుంటారు.
- ముఖ్యముగా వినాయకచవితి, సుబ్రహ్మణ్యషష్ఠి పర్వదినములలో బ్రాహ్మీ ముహూర్తములో వెలిగించిన చాలా శ్రేష్ఠం.
- శుక్రవారం రోజు సాయంత్రం శ్రీలక్ష్మీదేవి ముందు ఆరువత్తుల దీపాన్ని వెలిగించి కనకధారా స్తోత్రం, శ్రీమహాలక్ష్మీ స్తోత్రం, శ్రీ సూక్తాన్ని చదువుతారో వారికి ఇంట్లో సిరి సంపదలకు ఎటువంటి లోటురాదు.
- దీని వలన వారికి హుందాతనము ఏర్పడును. వ్యాపారాభివృద్ధి కలుగును. ఏకాగ్రత వృద్ధి అగును.
- ప్రతినిత్యము ఇంట్లో ఆరు వత్తుల దీపాన్ని వెలిగించి పూజలు చేస్తారో, వారికి శుభకార్యాలు జరుగుతాయి.

- క్రొత్త ఆలోచనలతో క్రొత్త మలుపులతో అతని జీవితములో వ్యాపారాభివృద్ధి కలుగును. శాస్త్రపాండిత్యములో ఉన్నతమైన స్థాయి చేరుకుంటారు.
- మొదటిపంటను కోసేటప్పుడు ధాన్యలక్ష్మికి ఆరు వత్తుల దీపంతో దీపారాధనచేసి ధాన్యాన్ని కోయటం ప్రారంభిస్తారో వారికి పంట బాగా పండి ధాన్యానికి కొరత వుండదు.
- దీని వలన ఆధ్యాత్మిక మార్గములో మంత్రసిద్ధి కలుగుతుంది.
- ముఖ్యముగా ఋణబాధలలో ఉన్నవారు ఈ వెలిగించినచో అప్పులు పూర్తిగా తీరిపోవును.
- దీనిని సుబ్రహ్మణ్య స్వరూపముగా పూజిస్తారు.
- కొంత మంది గణపతి స్వరూపముగా భావిస్తారు.
- దీనిని పాలిస్తున్నది శుక్రుడు కావున నీచశుక్రుడు, శుక్రపాపి అగు జాతకచక్రములు కలవారు దోషనివారణ కొరకు వెలిగించ వలెను.
- దీని ఏకాగ్రత, విజ్ఞానముకలుగును. దృష్టిదోష నివారణ, వ్యాపారాభి వృద్ధి కలుగుతుంది.
- చదువులో బాగా వెనుకబడినవారు. బుద్ధిమాంద్యంగా ఉన్నవారు వెలిగించినచో వీరు పరీక్షలలో సఫలీకృతులగుదురు. సరస్వతీ దేవి అను గ్రహమునకు పాత్రులు కాగలరు.
- దీని ధనము, శారీరధారుడ్యము, ఆరోగ్యము, శక్తి,విజయము లభించును.క్షయ, బి.పి, మూర్ఛరోగములకు చాలా మంచిది.
- దీని వ్యాపారాభివృద్ధి, సంపదలు కలుగును స్త్రీలకు సంబం ధించిన అనేక పాపములు తొలగిపోవును. అంతేగాక శత్రువు లకు విజయము కలుగుతుంది.



- దీనిని కార్తికేయ స్వరూపముగా భావించి కృత్తికానక్షత్రములోను షష్ఠితిథి యందు సుబ్రహ్మణ్యషష్ఠి పర్వదినములలో పూజిస్తారు.
- దీని వలన శిశుహత్యాదోషం కూడా తొలగిపోతుంది.
- ప్రత్యేకముగా రాజకీయనాయకులకు బాగాపనిచేస్తుంది. వాని అత్యున్నత శిఖరములకు తీసుకుని వెళ్తుంది.
- దీనివలన భయంకరవ్యాధులైన హిస్టీరియా, ఫిట్స్, భయపడుట మరియు స్త్రీలకు సంబంధించిన వ్యాధులు కూడా తగ్గును.





**ఏడు వత్తుల దీపాలతో దీపారాధన చేయటం వలన కలిగే ఫలితాలు**

- కుజగ్రహమునకు ఏడు వత్తుల దీపాలను వెలగించటం వలన సమస్త రోగాలు మొత్తం నివారణ అవుతాయి.
- వైష్ణవ సంప్రదాయము ప్రకారము శేష నాగ స్వరూపముగా పూజిస్తారు. ఒక్కొక్కవత్తి ఒక్కొక్కసర్పముగా భావిస్తారు. అవి అనంత, కర్కాటక, పుండరీక, తక్షక, విశ్లోభన, కరిష్మా, శంఖ చూడుడు ఇవి అత్యంత శక్తి వంతమైన సర్పాలుగా భావిస్తారు.
- సూర్యుడు వద్ద ఏడు వత్తుల దీపాన్ని ముందు వెలిగిస్తే చర్మరోగాలు నయము కాగలవు.
- ఏడు వత్తులు, సప్తమాతృకలు, సప్తఋషులు, సూర్యునికి ప్రతీక దీనిని ధరిస్తే లక్ష్మీకటాక్షము సిద్ధిస్తుంది. శుభులై పద్ధతి ప్రకా రము ధరిస్తే, జ్ఞానము, సంపద లభిస్తుంది. బంగారు దొంగ లించిన పాపము తొలగి పోతుంది.

- పితృకార్యాలు జరిగేటప్పుడు ఏడు వత్తుల దీపాన్ని వెలిగించిన పెద్దలకు శాంతి కలుగుతాయి.
- ముఖ్యముగా దీపావళి పర్వదినమునందు లేదా శుక్రవారము ఉద యము 6గం॥ నుండి 7గం॥లోపుగా లక్ష్మీపూజచేసి వెలిగించిన చాలా శ్రేష్ఠం.
- శనివారం రోజు ఉదయం 6గం॥ నుండి 7.00లలో శ్రీశనైశ్చర స్వామివారికి ఏడువత్తుల దీపాన్ని వెలిగించి నువ్వులను దానం చేస్తే వారికి ఏలినాటి శని సమస్యలు తొలగగలవు.
- సాధారణముగా శనివారము, బ్రాహ్మీముహూర్త సమయములో వెలిగించగలరు.
- కార్తవీర్యార్జున మంత్రము పఠించి ఏడువత్తుల దీపాన్ని వెలిగించి పూజ చేస్తే కోర్టు విషయాల్లో విజయం కలుగుతుంది.
- ముఖ్యముగా ఏలినాటిశని అనేక బాధలు పడుచున్నవారు గత 7గం॥లు గా బాధపడుచున్నవారు దీని వలన బాధలు నుండి విముక్తులు కాగలరు.
- ప్రతినిత్యం ఏడు వత్తుల దీపాన్ని నేతితో దీపారాధన చేసి హనుమాన్ చాలీసాను పారాయణ చేస్తే అప్పాలు నైవేద్యంగా పెట్టి సింధూరమును నుదుటను ధరిస్తే దుస్వప్నాలు రావు.
- దీనిని వలన మనస్సులో సంపద నిండుగా ఉన్నట్లు భావించ బడతారు.
- దీని వలన పాపములు అంటవు, పేదరికముదరిచేరదు సంపద, పేరు, ఆధ్యాత్మిక జ్ఞానం సొంతమగును.
- దీని వలన అకాల మరణాన్ని నివారిస్తుంది. స్త్రీ వశీకరణకు, లైంగికశక్తి పెరుగుతుంది.



- దీనిని మన్మథ స్వరూపముగా భావిస్తారు.
- దీనిని "అనంగ" స్వరూపముగా పూజిస్తారు.
- దీనిని "లక్ష్మీ" స్వరూపముగా పూజిస్తారు.
- దీని వలన సప్తమాతృకలుగా కూడా వ్యవహరిస్తారు. అనగా బ్రాహ్మీ, యోగేశ్వరి, కౌమారి, వైష్ణవీ, చాముండి, వారాహి, ఇంద్రాణి అను వారు ఉందును.
- దీనిని అనంతుని స్వరూపముగా పూజిస్తారు
- దీనిని సప్తఋషులు స్వరూపముగా భావిస్తారు.
- దీనిని పాలిస్తున్నది శనిగ్రహము. దీని వలన ఏలినాటిశని, చతుర్ధశని, అష్టమశని,అర్థాష్టమశని, నీచశని,శనిమహర్దశ శని అంతర్దశ జరుగు పీడలు తొలగును.
- దీని వలన గోహత్యా, దొంగతనం లాంటి పాపాలు తొలగి పోతాయి. జాతకచక్రం సరిగాలేని వారికి అకాలమరణము సంభవించకుండా ఉంటుంది.
- దీని వలన సంపద, గౌరవమర్యాదలు, సంపూర్ణారోగ్యము, తెలివితేటలు, మహాజ్ఞానము పెరుగును. ఐశ్వర్యము, ధనప్రాప్తి కలుగుతుంది. సమస్త దారిద్ర్య నివారిణి.
- దీని వలన మోహినీవిద్య లభ్యమగును. అంతేగాక గుప్తనిధులు లభ్యమగును. స్త్రీలు వశమగుదురు. శత్రువినాశనము జరుగును.
- దీని వలన యువతరమునకు బాగా పనిచేస్తుంది. అంతేగాక తాను కోరుకున్న మనిషితో ప్రేమానురాగాలు తప్పక ఏర్పడతాయి.

**ఎనిమిది వత్తుల దీపాన్ని దీపారాధన చేయటం వలన కలిగే ఫలితాలు**

- ❑ శివాలయములో ధ్వజస్థంభము వద్ద ఎనిమిది వత్తుల దీపాన్ని వెలిగించి మహామృత్యుంజయ మంత్రాన్నిజపిస్తే వారికి అన్ని రకాల మృత్యు భయాలు తొలగిపోయి వారి ఆయుస్సు వృద్ధి అవుతుంది.
- ❑ దీనిని అష్టమాతలు అష్టవసులు,గంగాదేవి రూపముగా, భావిస్తారు.
- ❑ రావి చెట్టు క్రింది ఉన్న నాగదేవత విగ్రహాల ముందు ఎనిమిది వత్తు లతో దీపారాధనచేసి 21 ప్రదక్షిణలుచేస్తారో వారికి సంతానము కలిగి సుఖశాంతులతో ఉంటారు.
- ❑ శ్రీలక్ష్మీగణపతి హోమగుండానికి ఎనిమిది వైపులుగా ఎనిమిది వత్తుల దీపాన్ని కొబ్బరినూనెతోకాని, దీపారాధనచేసి పూర్ణాహుతి చేస్తే అష్టనిధి నవనిధులు లభిస్తాయి.
- ❑ సాధారణముగా ఆదివారము రాహుకాలములో వెలిగించవలెను.
- ❑ వనదుర్గాదేవి ముందు ఎనిమిది వత్తుల దీపాన్ని వెలిగిస్తే అమ్మవారి అనుగ్రహం తప్పకుండా లభిస్తుంది.
- ❑ దీనిని వెలిగి సత్యదేవత ప్రసన్నురాలవుతుంది. నీచస్త్రని, మరియు గురుపత్నిని తాకిన కల్లేపాపము తొలగిపోతుంది. అన్ని పాపాలను తొలగిస్తుంది



- ❑ శత్రుబాధలు, ఉన్న వారు దుర్గా దేవీ ముందు ఎనిమిది వత్తులతో దీపాన్ని వెలిగించి దేవీఖడ్గమాలను చదివితే వారికి శత్రు బాధలు ఉండవు.
- ❑ దీని వలన గొప్ప నమ్మకముతో తనకు దారిలో ఎదురగు అడ్డంకులు తొలగించుకుని ముందుకు సాగుదురు.
- ❑ దీనిని వెలిగించువారికి వినాయకుని అనుగ్రహము లభించును.
- ❑ దీని వెలిగించువాడు ప్రత్యేకత సంతరించుకుని చదువులో (విద్య) అద్భుతమైన ప్రగతి సాధించును.
- ❑ ఈ దీపారాధన ముఖ్యముగా పూజలలో వాడెదరు. దీని వలన దీర్ఘకాలిక జీవితము మరియు సత్యసంధత కలుగును.
- ❑ దీనిని వినాయకుని స్వరూపముగా పూజిస్తారు.
- ❑ దీనిని అష్టభుజ భగవతీదేవతల స్వరూపముగా భావిస్తారు.
- ❑ దీనిని గంగాదేవి స్వరూపముగా పూజిస్తారు.
- ❑ దీనిని అష్టమాతృకల స్వరూపముగా భావిస్తారు.
- ❑ దీనిని భైరవస్వరూపముగా భావిస్తారు.
- ❑ దీనిని రాహువుగ్రహము పాలిస్తున్నది. కావున దీని ధారణవలన "రాహుగ్రహ పీడానివారణ తొలగును. మరియు సప్తముఖివలే శని పీడలు కూడా తొలగించును.
- ❑ దీని వలన విఘ్నాలు అన్ని తొలగి సంతోషము తప్పక కలుగును. అంతేగాక మృత్యుం జయత్వము మంచిపేరు, మంచి ఆరోగ్యమును కలుగును.
- ❑ దీని వలన గుర్రప్పందాలలో, లాటరీలలో విజయము లభిస్తుంది. వ్యాపారాభివృద్ధి మోసాల నుండి తప్పించుకోవడానికి పక్షవాతరోగులకు పనికివస్తుంది.

- పూర్వ పాపముల నుండి పరిహారము పొంది పేరు ప్రఖ్యాతులు సంపదలు సంపాదిస్తారు.
- దీని వలన ఏది కావాలంటే అదిలభిస్తుంది. అంతేగాక పరస్త్రీ సాంగత్యం దొంగసాక్ష్యం, దొంగవ్యాపారం లాంటి పాపాలు తొలగిపోతాయి.
- దీని వలన అష్టభుజ భగవతీదేవీ కృపాకటాక్షములకు పాత్రుడై పూర్వజన్మ పాపములు అన్నియు తొలగించబడి పేరు ప్రఖ్యాతలు సంపదలు నొందురు.



**తొమ్మిది వత్తుల దీపాలతో దీపారాధన చేయటం వలన కలిగే ఫలితాలు**

- దేవీ నవరాత్రులలో అమ్మవారి ముందు నవరాత్రులలో తొమ్మిది వత్తుల దీపాలనువెలిగించి పూజచేసి వారికి దేవి అనుగ్రహం కలుగును.
- తొమ్మిది వత్తులు రుద్రాక్ష భైరవుడు మరియు యమధర్మరాజుకి ప్రతీక దీనిని ధరిస్తే యముని వల్ల భయం ఉండదు.
- నవగ్రహాలకు పూజ తొమ్మిది దీపాలతో కొబ్బరినూనెతో వెలిగించి నవగ్రహాలకు దానాలనుచేస్తే నవగ్రహాల అను గ్రహం కలుగును.
- నవరాత్రులలో దుర్గాదేవి పూజలు ఉంచి వెలిగించిన చాలా మంచిది.



- శ్రీ లక్ష్మీనారాయణస్వామి తొమ్మిది వత్తుల దీపాలను వెలిగించి విష్ణు లక్ష్మీసహస్రనామాలను పఠిస్తే వారికి ధనవృద్ధి కలుగును.
- దీని వలన ఇంద్రుని అనుగ్రహము పొంది రాజపదవి పొందును అంతేగాక గణేశుని అనుగ్రహము కలుగును.
- తొమ్మిది వత్తులతో దీపారాధనచేసి భూసూక్తం పారాయణ చేస్తే భూమి సమస్యలన్నీ తొలగిఆస్తి మీకు వస్తుంది.
- దీనివలన మంచి వాక్ధాటితో ఎదుటివారికి ఒప్పించగల నేర్పరి తనము తనకువచ్చిన ఆలోచనలు అన్నియు క్రియా రూప ములో ఉంచును.
- ప్రతి పనిలో ఆటంకము లేకుండా జరగాలి అని కోరుకున్నవారు 9 వత్తులు వెలిగించాలి.
- దీనిని భైరవస్వరూపముగా పూజిస్తారు. మరియు యమస్వరూప ముగా భావిస్తారు.
- దీనిని నవశక్తులను ప్రతీకగా పూజిస్తారు. అనగా విద్యాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, శాంతశక్తి, వామశక్తి, జ్యేష్ఠాశక్తి, రేధీశక్తి, అంగశక్తి పశ్వంతీ అనునవి ఉండును.
- దీనిని ధర్మదేవతాస్వరూపముగా భావిస్తారు.
- దీనిని కపిల మహర్షి స్వరూపముగా చూస్తారు.
- దీనిని కేతు గ్రహము పాలిస్తున్నది. కొంతమంది భావిస్తారు. కావున దీని ధారణ వలన కేతు గ్రహపీడనివారణ తొలుగును ముఖ్యముగా దీని వలన స్త్రీలకు గర్భస్రావము తొలగిపోవును. అంతేగాక శని, రాహుగ్రహపీడలు తొలగును.
- దీని వలన మృత్యుభయము ఉండదు. తాంత్రికశక్తుల ప్రయో గించ బడినచో రక్షణకవచముగా పనిచేస్తుంది. గుండెజబ్బులు రానివ్వదు.

- దీని వలన నవగ్రహశాంతి కలుగును. నవరత్నముల ఉంగరము, నవరత్నహారము, ధరించు ఫలము కలుగును.
- దీని వలన నవమాతృకల (దేవీ) అనుగ్రహము పొంది సర్వ శక్తులు, శుభములు పొంది చివరకు ముక్తిని పొందుతాడు.
- దీని వలన విజయము,కీర్తి,ఆధ్యాత్మికాభివృద్ధి లభించును.
- దీని వలన సంపద మరియు సంతోషము కలుగును అంతేగాక ఆధ్యాత్మికవృద్ధి, సిరిసంపదలు కలుగును. పరోపకారబుద్ధితో అందని మెప్పును పొందుతారు.
- దక్షిణ బారతదేశములో భక్తులు నవరాత్రి పర్వదినములలో దీనివలన ఎడమచేతికి దుర్గాదేవి అనుగ్రహము కొరకు ధరిస్తారు.



## పది వత్తులలతో దీపారాధన చేస్తే కలిగే ఫలితం

- గంగాదేవికి పది వత్తులతో గంగా హారతి యిస్తే వారికి పుణ్యం లభిస్తుంది.
- దీనిని అధిపతి దశదిక్కులు,విష్ణుభగవానుడు, దీనిని వెలిగిస్తే దశదిశల యందు కీర్తి లభిస్తుంది. సిరిసంపదలకు కీర్తి ప్రతిష్ఠల ఫలప్రదాయిని.
- కార్తీకమాససోమవారము, పౌర్ణమి నాడు శివుని ముందు పది వత్తులతో దీపారాధనచేస్తే అనంతకోటి పుణ్యము సంప్రాప్తించును.



- సాధారణముగా బుధవారము ఉదయము 6గం॥ నుండి 7గం॥ లోపుగా వెలిగిస్తారు.
- గాయత్రీదేవికు పదివత్తులతో దీపారాధన చేసి గాయత్రీ మంత్రాన్ని 108 మార్లు జపించినచో మంచి వాక్ శుద్ధి కలుగును.
- ముఖ్యముగా ముక్కోటి ఏకాదశి,తొలిఏకాదశి బ్రాహ్మీముహూర్త సమయ ములో వెలిగిస్తారు.
- పది వత్తులతో దీపాన్ని విష్ణాలయములో వెలిగిస్తే వారి పూర్వజన్మలో చేసిన దోషాలుకూడా పటాపంచలు అవుతాయి.
- భూత, ప్రేత, పిశాచ, రాక్షస, బ్రహ్మరాక్షస భయాలు దీనితో తొలగి పోతాయి. అన్ని గ్రహాల శాంతి లభిస్తుంది.
- వైశాఖమాసం, శ్రావణమాసం, కార్తీకమాసం, మాఘమాసంలో పౌర్ణిమ రోజున సాయంకాల సమయాల్లో సంకల్పం చెప్పుకుని దీపాలను దానంచేస్తే వారికి అనారోగ్యము దరిచేరదు.
- దీని వలన భయం అనేది కలుగదు. సకల పీడలను తొలగిస్తుంది.
- దీనివలన దుష్టగ్రహపీడలు, పిశాచబాధలు అన్నియు దూరమగును.
- దీని వలన శ్వాసకోసమునకు సంబంధించిన వ్యాధులు దూరమగును. మరియు ముఖ్యముగా పొడిదగ్గు, ఆస్త్మాదూరమగును.
- ముఖ్యముగా దీని వలన నవగ్రహాల కృపాదృష్టికి పాత్రులు కాగలరు.
- దీనిని విష్ణువు/జనార్దన స్వరూపముగా ధరిస్తారు.

- ఏకవత్తి సంపూర్ణశివాంశము. దశవత్తులు సంపూర్ణ విష్ణాంశము.
- కొంతమంది ఈ దీపారాధన దశదిక్కులచే పాలించబడుచున్నదని చెపుతారు.
- దీని వలన దుష్టగ్రహపీడ నివారణ కలుగును. దుష్టశక్తులు, విషజంతువుల నుండి రక్షణ కలుగుతుంది.
- దీనివలన అనుకున్న కోరికలు నెరవేరును అంతేగాక ఆయుధముల నుండి ప్రాణభయము ఉండదు. యమలోకబాధలు తొలగించును.
- దీనిని ప్రత్యేకముగా ఏగ్రహము పాలించుటలేదు. నవగ్రహాల అనుగ్రహ పాత్రుడై దీనిని ధరించిన అమితానందము పొంది దుష్టపీడ నివారణ కలుగును.
- దీని వలన మంత్రప్రయోగము నుండి రక్షించబడి మంచి ఆరోగ్యము కలుగును. గ్రహ బాధలు నాగదోషాలు పోతాయి.
- దీనివలన మోసము, కుట్రనుండి అసూయాద్వేషము నుండి తేలికగా బయటపడుదురు కోరింత పొడిదగ్గు పూర్తిగా తగ్గుతుంది.
- ఆధ్యాత్మిక మార్గములో దీని వలన గొప్ప ప్రాముఖ్యత కలదు.
- దీనివలన జైలుశిక్ష, పిశాచబాధ, పోట్లాటలు,విషసర్ప బాధ కలుగనేరదు.
- తాంత్రికశక్తులు ప్రయోగము మారణ, మోహన, అకాల మృత్యువు దరిచేరవు. మృత్యుభయం తొలగును.





**పదకొండు వత్తుల దీపాలతో దీపారాధన చేసిన కలిగిన ఫలితం**

- పదకొండు వత్తులకు అదిదేవత ఇంద్రుడు.
- సాధారణముగా సోమవారము ఉదయము 6గం॥ నుండి 7గం॥ లోపుగావెలిగిస్తారు.
- ముఖ్యముగా శివరాత్రి పర్వదినములందు బ్రాహ్మీముహూర్త సమయములందు వెలిగించిన శ్రేష్ఠం.
- దీని వలన ఒకవేయి అశ్వములను, ఒక వేయి గోవులను బ్రాహ్మణులకు దానము చేసిన ఫలితము కలుగును.
- ఒక్కొక్క వత్తిని రుద్రుడుగా భావించవలయును. అంతేగాక దీని వలన వెంటనే సత్ఫలితములు కనబడును.
- దీని వలన పరిశోధకుడు,భయరహితుడు అగును. అంతేగాక తనకు మనస్సులోని గల ఆలోచనలలు ఆచరణలో ఉంచును.
- ధ్యానము చేయాలని అనుకున్నవారు ధ్యానము చేయలేకపోతే దీనిని వెలిగించిన సరిపోతుంది. వేల ఆవులను దానము చేసిన ఫలితము దీనివల్ల లభిస్తుంది.
- మాంగల్యదోషము ఉన్నవారు వెలిగించిన ఆదోషములు తొలగిపోవును.
- దీనిని ఏకాదశ రుద్రుల స్వరూపముగా భావిస్తారు. మరియు వీరభద్రుని స్వరూపముగా భావిస్తారు.

- ముఖ్యముగా ఇంద్రస్వరూపముగా భావించి వెలిగిస్తారు.
- దీనికి ప్రత్యేకగ్రహము పాలించుటలేదు. ధ్యానజపాలందు ఉపయోగించును.
- దీనిని రుద్రస్వరూపముగా భావిస్తారు. ముఖ్యముగా స్త్రీలకు చాలాఉపయోగపడును. వారి వైవాహికజీవితములో అదృష్టమూ దీర్ఘ సుమంగళత్వమును ప్రసాదిస్తుంది.
- దీనివలన వైవాహిక జీవితములో సౌభాగ్యము, సంతోషము కలుగును. పూర్వకాలమున ఋషి పత్నులు ఎక్కువ వెలిగించే వారు.
- దీనివలన ధైర్యము, నమ్మకము కలుగును. సంపద, జ్ఞాన సమృద్ధికలుగును. స్త్రీలకు సిరిసంపదలు,సంతానప్రాప్తి కలు గును. ఉదార స్వభావము కలుగును.
- దీనిని పురుషులు వెలిగించిన వేయి యజ్ఞాలుచేసిన ఫలం కలుగుతుంది.
- దీనివలన రక్తపోటు తగ్గించును. స్త్రీలకు గైనకాలజీ వ్యాధులు రానివ్వదు.
- అశ్వమేధయాగ ఫలం లభించును.
- స్త్రీలుదీనిని వెలిగించిన మగసంతానము ఖచ్చితముగా కలుగు తుంది.
- దీని వలన మనస్సు ప్రశాంతముగా ఉండి అంతిమ దశ యందు పరమయోగి అగును. అంతేగాక అనంత పుణ్యఫల మును, సకల శుభములు ప్రసాదించును.





## పన్నెండు వత్తుల దీపాలతో దీపారాధన చేసిన కలిగిన ఫలితం

- 12వత్తులు కలిగినది. విష్ణుమూర్తి స్వరూపము 12 మంది సూర్యులు (ద్వాదశాదిపత్యులు) దీనికి అధిపతులు
- సాధారణముగా ఆదివారము,ఉదయాన 6గంII నుండి 7గంII లోపుగా వెలిగిస్తారు.
- ముఖ్యముగా రథసప్తమి పర్వదినములందు బ్రాహ్మీముహూర్త సమయ ములందు వెలిగించిన చాలా శ్రేష్ఠం.
- దీని వలన శస్త్రాలవల్లగాని, పులి క్రూరజంతువుల వలన భయం ఉండదు. దీనివలన ఆది, వ్యాధి బాధలు దూరమై రాజు అవుతాడు. మరియు కీర్తిని పొందుతాడు.
- దీని వలన గోవు దానము చేసిన ఫలితము కలుగును. దీని వెలిగించినవారు అగ్నికి, ఆయుధములకు,వ్యాధులకు, జబ్బు లకు దూరమగుదురు.
- దీని వలన నాయకత్వమును సూచించును. అంతేగాక సూర్యుని వలె వెలుగొందెదరు.
- దీనివలన ఆకర్షణశక్తి పెరుగును మరియు అందము ద్విగుణీ కృతము అగును.

- ❑ ఆరోగ్యము, సంపదకొరకు వెలిగించిన చాలా మంచిది. అంతేగాక ఐశ్వర్యం సుఖం కూడా అందించును.
- ❑ దీనిని ద్వాదశాదిత్యులు స్వరూపముగా చూస్తారు. అనగా ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూష అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశమంతుడు, వరుణుడు,మిత్రుడు అనువాడు ఉండును.
- ❑ దీనిని విష్ణువు, స్వరూపముగా భావిస్తారు.
- ❑ దీనిని పాలించేది సూర్యుడు అని భావిస్తారు.
- ❑ దీనిని లక్ష్మీదేవికి ప్రీతిపాత్రుడై గొప్ప సంపద కలిగిన వాడగును.
- ❑ దీనిని పాలించేవారు విష్ణువు ఆయనకు ప్రీతికరమైన లక్ష్మీదేవి అను గ్రహము లభించి సిరిసంపదలు కలుగును.
- ❑ ఈ ద్వాదశ వత్తులు ఏక వత్తితో సమానము.
- ❑ దీని వలన సుఖ సంపదలు, ఆధ్యాత్మికాభివృద్ధి కలుగును. గౌరవం, వ్యక్తిత్వం పెరుగుతుంది. బ్రహ్మచర్యము నిలుపును.
- ❑ దీని వలన చోరాగ్నియభయం,వ్యాధిభయం జంతువులహాని కలుగదు.
- ❑ దీని వలన గోహత్య, నరహత్య చేసినపాపాలు తొలగిపోతాయి. శారీరక, మానసిక వ్యాధులురావు. జ్యోతిషపండితులు వెలిగించినచో వారికి వాక్కుశుద్ధికలుగును.
- ❑ దీని వలన అదృష్టము కలిగితీరును.
- ❑ ఎవరయితే దేశాన్ని, ప్రపంచాన్ని ఏలి సిరిసంపదలతో తులుతూగాలని భావిస్తారో వారు దీనిని ఎల్లప్పుడు వెలిగిస్తారు.







## పదమూడు వత్తుల దీపాలతో దీపారాధన చేసిన కలిగిన ఫలితం

- ❑ 13 వత్తులు మన్మధునికి ప్రతీక
- ❑ సాధారణముగా మంగళవారము ఉ॥ 6గం॥నుండి7గం॥లోపుగా వెలిగిస్తాం.
- ❑ ముఖ్యముగా సుబ్రహ్మణ్యషష్ఠి,నాగపంచమి, పర్వదినములందు బ్రాహ్మీ ముహూర్త సమయములందు వెలిగించిన చాలా శ్రేష్ఠం.
- ❑ దీనివలన అమితానందముతో జీవింతురు వారికి అభివృద్ధి కలుగును.
- ❑ దీనివలన అనేక వ్యాధులు దూరమగును.
- ❑ దీనివలన పాపపు ఆలోచనలు పనులు మనసులోనికిరావు.
- ❑ దీనివల్ల విలాసాలు లభిస్తాయి. పొరపాటున బంధువర్గము వారిని చంపిన పాపము నుండి విముక్తులగుదురు.
- ❑ ఋణపీడలతో ఉన్నవారు దీని వలన అప్పులబాధ తీరును. ధాతు, రస, రసాయన సిద్ధికలుగుతుంది.
- ❑ దీనినిషణ్ముఖ స్వరూపముగా చూస్తారు.
- ❑ దీనిని విశ్వాదేవి స్వరూపముగా భావిస్తారు.
- ❑ దీనిని "కామదేవ" స్వరూపముగా భావిస్తారు.

- దీనిని మన్మథ స్వరూపముగా తలుస్తారు.
- దీనిని ఇంద్ర స్వరూపముగా పూజిస్తారు.
- దీనిని షణ్ముఖి రుద్రాక్షతో పోలుస్తారు.
- కేవలము అదృష్టజాతకులకు మాత్రమే లభిస్తుంది. దీనిని వెలిగించిన వారికి ఉన్న కోరికలు అన్నియు నెరవేరును.
- దీని వలన రససిద్ధి కలుగుతుంది, కోరికలు, ఫలించును. దీని వలన అదృష్టము తీసుకుని వస్తుంది.
- దీని వలన సిద్ధి, వశీకరణలాంటి శక్తులు లభించును. ధన, కనక, వస్తు, వాహనాదులు సమకూర్చును.
- దీనివలన ఎదుట వ్యక్తిని వశపరచుకుని తనకోరికలు నెరవేర్చు కొనును.
- దీనిని మోక్షాపేక్ష కలవారు ధరించాలి. నాయకత్వ లక్షణములకు కోరి కలు తీరుటకు ఉపయోగపడుతుంది.





## పద్నాలుగు వత్తుల దీపాలతో దీపారాధన చేసిన కలిగిన ఫలితం

- 14 వత్తులు శివుని కన్నుల నుండి వెలువడినది.
- సాధారణముగా సోమవారము లేదా మంగళవారము ఉదయాన్నే వెలిగించవలెను.
- ముఖ్యముగా హనుమజ్జయంతి, శివరాత్రి పర్వదినములందు బ్రాహ్మీ ముహూర్త సమయములందు వెలిగించిన చాలా శ్రేష్ఠం.
- ఆంజనేయక్షేత్రములందు వెలిగించిన విశేషఫలితములు కనిపించును.
- దీని వలన భవిష్యత్తును సూచించగల శక్తి ఏర్పడును.
- అంతేగాక చక్కటి నిర్ణయాలు తీసుకొనుదురు అంతన మహిమలు కలుగచేయును.
- దీని వలన అనేక వ్యాధులను దూరము చేయును.
- దీనిని శివపార్వతి స్వరూపముగా చూస్తారు. మరియు శివ(రుద్ర) స్వరూపముగా భావిస్తారు.

- దీనిని "హనుమాన్" స్వరూపముగా చూస్తారు.
- 14 లోకములు,14 విశద్యలు,14 దేవతలు స్వరూపముగా భావిస్తారు.
- దీనిని శని పాలిస్తున్నాడని సప్తవత్తులతో పోలుస్తారు.
- దీని వలన పేరు ప్రఖ్యాతలు, గౌరవము, సంపదలు లభించును. రోగాలనుండి రక్షణ నరాలపటుత్వం, మానసికశాంతికి ఉపయోగపడు తుంది.
- దీని వలన ఆరోగ్యము, విజయము లభించును. వంశాభివృద్ధికి చాలా మంచిది. దీనివలన వ్యాధులు దరిచేరవు. దీని వలన అందరి దేవతల దృష్టిలో పూజ్యస్థానం పొందుతారు.
- దీని వలన సర్వరోగములు పోవును.





## పదిహేను వత్తుల దీపాలతో దీపారాధన చేసిన కలిగిన ఫలితం

- దీనిని పశుపతినాథ స్వరూపముగా భావిస్తారు.
- ముందు "ఓం నమశ్శివాయ" అను పంచాక్షరీ మంత్రమును కనీసం 108 మార్లు జపించి వెలిగించాలి.
- వీలయినంతవరకు సోమవారంనాడు బ్రాహ్మీముహూర్త సమయ ములో శివస్తోత్రములు పఠిస్తూ వెలిగించాలి.
- శివాలయంలో ఏకాదశమహన్యాస పూర్వక రుద్రాభిషేకముచేసి వెలిగించాలి.
- కార్తీక సోమవారములందుగాని కార్తీకపూర్ణిమలందు ఉపవా సము చేసి శివార్చన చేసి వెలిగించగలరు.
- శైవక్షేత్రములను దర్శించినప్పుడు వెలిగించినప్పుడు పూజ చేసించిన చాలా శ్రేష్ఠం.
- దీని వలన చర్మవ్యాధులు దరిచేరవు. ఆధ్యాత్మిక సాధనకు మానసిక శాంతికి ఉపయోగపడును.
- దీని వలన ఆరోగ్యము, సంపద,శక్తి,ఆత్మస్థైర్యం, ఆధ్యాత్మికాభి వృద్ధి కలుగును. మనస్సు శరీరం నిర్మలముగా ఉంటుంది.
- దీని వలన కర్మ పరికవ్వము చెందును. ఆధ్యాత్మిక సాధనకు ధరిస్తుంది.
- దీని వలన గొప్ప ఆలోచనలు,తెలివితేటలు కలుగును.

## పదహారు వత్తుల దీపాలతో దీపారాధన చేసిన కలిగిన ఫలితం

- "షోడశ" స్వరూపముగా భావిస్తారు.
- ముఖ్యముగా దీనిని శుక్రవారము రాహుకాలములో కుంకు మార్చనచేసి వెలిగించిగలరు.
- వీలయినచో ఆదివారం రాహుకాలములో (సా4-30గం॥ నుండి 6గం॥వరకు) దుర్గాసూక్తము పఠిస్తూ వెలిగించిన చాలా శ్రేష్ఠం.
- మనిషి ధైర్యముతో జీవితము కొనసాగించగలడు.
- ముఖ్యముగా "తొలిఏకాదశి" వైకుంఠ ఏకాదశి, ముక్కోటి ఏకాదశి పర్వదినములందు వెలిగించగలరు.
- ముందుగా శివాలయములో రుద్రాభిషేకము చేయించి వెలిగించగలరు.
- తరువాత వైష్ణవాలయములో శుక్రవారం వేంకటేశ్వరస్వామి దేవాలయ ములో వెలిగించి ఉంచిన చాలా శ్రేష్టం.
- ముందుగా "విష్ణుసహస్రనామస్తోత్రమ్ పారాయణచేసి వెలిగించ వలెను
- దీని వలన మనిషి జీవితములో "లేదు" అను మాటలేదు.
- దీనివలన ముఖ్యముగా సిరిసంపదలకులోటు ఉండదు. సమస్త (అన్ని) కోరికలు నెరవేరుతాయి.





## ఇరవై వత్తుల దీపాలతో దీపారాధన చేసిన కలిగిన ఫలితం

- దీనిని "బ్రహ్మ" స్వరూపముగా భావిస్తారు.
- ముఖ్యముగా దీనిని గురువారమునాడు (ఉదయం 6గం॥నుండి 7గం॥లోపుగా) వెలిగించగలరు.
- దీనిని శిరస్నానముచేసి బ్రాహ్మీముహూర్త సమయమున వెలిగించ గలరు.
- త్రిమూర్తులకు అష్టోత్తరపూజ లేదా త్రినాథవ్రతము ఆచరించి తరువాత వెలిగించగలరు.
- దీని వలన దైవము యందు నమ్మకము, ఆధ్యాత్మికాభివృద్ధి మానసిక శాంతి కలుగును.
- దీని వలన తప్పకుండా పరిశోధకులుగా తయారవుతారు.
- దీనివలన మనిషి క్రొత్త విషయములు జీవితములో కనుగొం టాడు. విజ్ఞానఖనులు మారదలచుకున్నవారు వెలిగించాలి.
- మంత్ర,తంత్ర ప్రయోగములు వెలిగించి వారి మీద పనిచేయ లేవు
- దీని వలన మనిషి రాజు అవుతాడు.
- దీనిని "కుబేర" స్వరూపముగా భావిస్తారు.

- ముఖ్యముగా దీనిని శుక్రవారం (ఉదయము 6గం॥ నుండి 7గం॥ ల లోపు)గా వెలిగించగలరు.
- ముందర అష్టలక్ష్మి,లక్ష్మీదేవాలయములందు కుంకుపూజతో అష్టోత్తర పూజ చేయించి వెలిగించగలరు.
- ముఖ్యముగా దీపావళి పర్వదినమున తప్పక పూజామందిరములో వెలిగించగలరు.
- దీని వలన పేదవారు అతి కొద్ది కాలములోను ధనవంతులు కాగలరు.
- దీని వలన సంపదలు వచ్చును.ధనధాన్య సిరిసంపదలతో తులతూగు తారు.
- కోటీశ్వరులకు, లక్షాధికారులకు మాత్రమే ప్రతిరోజు వెలిగించగలరు. విజ్ఞాభివృద్ధి కూడా కలిగించును.
- ప్రతి నిత్యం వెలిగించిన అసాధ్యమైనది ఏది ఉండదు. సర్వ కోరికలు నెరవేరతాయి.





## నిత్య జీవితములో దీపారాధన

ప్రతి ఇంట్లో దేవుని ముందు దీపారాధన చేయడం జరుగుతుంది. దీపారాధన చేసేవారు ఉదయం, సాయంత్రం రెండుసార్లు దీపారాధన చేస్తారు. దీపారాధనల్లో చాలా రకాలు ఉన్నాయి వాటిలో కొన్ని :

1. ఉసిరికాయ దీపం
2. నిమ్మకాయ దీపం
3. నువ్వులనూనె దీపం
4. పిండి దీపం
5. జలదీపం
6. నేతిదీపం
7. నూనె దీపం
8. నందాదీపం...... ఇంకా అనేకం ఉన్నాయి.

## ఉసిరికాయతో దీపారాధన

కార్తీక మాసంలో ఉత్థాన ద్వాదశి రోజున తులసి కోట దగ్గర శ్రీ దామోదరస్వామి వారి ప్రీతి కొరకు వెలిగిస్తారు. ఈ దీపాన్ని వెలిగించడం వలన పునర్జన్మ అనేది ఉండదు.

## ఉసిరిక దీపారాధన చేయడం వలన కలిగే ఫలితాలు

1. కార్తీకమాసంలో ప్రతిరోజు పూజ చేసేటప్పుడు పూజా స్థానంలో శంఖంతోపాటుగా, ఉసిరికాయను ఉంచి పూజ చేస్తే ఇంట్లో ప్రశాంతమైన వాతావరణం సుఖశాంతులతో వర్థిల్లుతుంది.

2. ఉసిరికాయలో చేసే దీపాన్ని శ్రీ మహాలక్ష్మి అమ్మవారి చక్రానికి ఎనిమిది దిక్కులలో ఉంచి చక్ర పూజ చేస్తే అప్పుల బాధ తొలగును.

3. లక్ష్మీదేవి అమ్మవారికి పూజ చేసేటప్పుడు ఉసిరికాయతో దీపం వెలిగించి దీపారాధనచేస్తే వారికి దారిద్ర్యంనివారణ కలుగును.

4. కన్యలు శుక్రవారం రోజున11మంది ముత్తైదువులకు తాంబూలంతోపాటు ఉసిరికాయను కూడా దానంచేస్తే వారికి కోరు కున్న వరుడు లభించగలరు.

5. శ్రీమహాలక్ష్మి అమ్మవారికి ఉసిరికాయ అంటే చాలా ప్రీతికరం. శుక్రవారంసాయంత్రం వేళల్లో లక్ష్మీదేవికి ఉసిరికాయతో దీపారాధన చేస్తే లక్ష్మీదేవి అనుగ్రహం కలిగి సంపదలకు ఎటువంటి లోటు ఉండదు.

6. కనకధారా స్తోత్రాన్ని శుక్రవారం నాడు చదివి ఆ తరువాత లక్ష్మీదేవికి ఉసిరికాయతో చేసిన పదార్థాన్ని నైవేద్యం పెడితే మహాలక్ష్మి అనుగ్రహం కలుగుతుంది.

7. ఉసిరికాయ రసము, తులసి రసం రెండింటిని కలిపి పార్వతీదేవికి, నైవేద్యంగాపెట్టి ఆ రసాన్ని రోగులకుతాగిస్తే కామెర్లు త్వరగా తగ్గుముఖం పడతాయి.

8. శ్రీ మహాలక్ష్మీదేవి కవచం లేక హృదయ పారాయణంచేసి ఉసిరికాయను దానంచేస్తే దారిద్ర్యము తగ్గిపోతుంది.

9. శ్రీ మహాలక్ష్మి దేవికి ఉసిరికాయతో దీపంతో హారతి ఇస్తే దారిద్ర్యము నశిస్తుంది.

10.ఉసిరికాయలో దీపారాధన చేసి శ్రీసూక్తంపారాయణచేస్తే ఇంట్లో ఎక్కువ ఖర్చు కాస్త తగ్గి ఆదాయం వృద్ధి కాగలదు.

11. ఉసిరిచెట్టుకు ప్రతిరోజు పూజచేసి ఆ చెట్టుకు నీటిని పోస్తూ నమస్కరిస్తూ ఉసిరిచెట్టు చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ ఉంటే వారికి మహాలక్ష్మి దేవి అనుగ్రహం కలుగును.



12. ఉసిరికాయను తొక్కినట్లయితే దరిద్రులౌతారు.

13. ఉసిరికాయల దీపాన్ని తులసికోట ముందు వెలిగిస్తే అపమృత్యు నివారణ కాగలదు.

14. మహాలక్ష్మీదేవికి పూజచేసి ఉసిరికాయని తాంబూలంలో ఉంచి ముత్తైదువులకు దానం చేస్తే ధనము సిద్ధిస్తుంది.

15. గంగానదిలో స్నానాంతరం పూజచేసిన తరువాత పూజలో భాగంగా బంగారు ఉసిరికాయ సంకల్పంతో పూజించి ఆ తరువాత ముత్తైదువకు దానం చేస్తే కాశీయాత్ర సాఫల్యము కాగలదు.

## నిమ్మకాయ దీపారాధన

నిమ్మకాయలంటే పార్వతీదేవికి ప్రీతికరం. నిమ్మకాయలతో చేసిన దండలు అంటే దుర్గాదేవికి చాలా ఇష్టము. పార్వతీదేవి స్వరూపాలైన భవానీ, కాళి,దుర్గ, శక్తి దేవాలయాల్లో మాత్రమే ఈ దీపాన్ని వెలిగిస్తారు. ఇంకెక్కడా వెలిగించరాదు.

మహాలక్ష్మి, సరస్వతీదేవీ దేవాలయాల్లో ఈ దీపాన్ని వెలిగించ రాదు. అలా చేస్తే ఆ ఇంట్లో ఆనందం అనేది ఉండదు. గొడవలు జరుగుతాయి. వ్యాపారంలో నష్టమువస్తుంది. నిమ్మకాయదీపాన్ని మంగళవారం, శుక్రవారంలో వచ్చే రాహుకాల సమయంలో మాత్రమే వెలిగించాలి. (మంగళవారం రాహుకాలం మధ్యాహ్నం 3.00 నుంచి 4.30 వరకు. శుక్రవారం ఉదయం 10.30 నుంచి 12 గంటల వరకు రాహుకాలము ఉంటుంది).

మంగళవారంనాడు వెలిగించే నిమ్మకాయ దీపం కన్నా శుక్రవారం వెలిగించే దీపమునకు ఎంతో ప్రాముఖ్యత ఉన్నది. మంగళవారం నాడు వెలిగించి చేసే దీపారాధన కు రజోగుణం కలిగినది. శుక్రవారం వెలిగించేచేసే దీపారాధనకు సత్వగుణం కలిగి ఉంటుంది.

మంగళవారం నాడు వెలిగించే దీపారాధన కన్నా శుక్రవారం చేసే దీపారాధన ఎంతో మంచిది.

శుక్రవారంనాడు అమ్మవారికి చేసే దీపారాధన వలన దీర్ఘ సుమంగళత్వము కలుగుతుంది.

## నిమ్మకాయతో దీపారాధన

1. ఇంట్లో నిమ్మకాయ దీపారాధన చేయరాదు.

2. శుక్రవారము రాహుకాలములో నిమ్మకాయల దీపాన్ని వెలిగిస్తే దుర్గాదేవి అనుగ్రహం కలిగి పనులన్నీ సక్రమముగా జరుగును.

3. పండుగలప్పుడు, పెద్దల తిథి కార్యాలలో నిమ్మకాయలతో దీపారాధన చేయరాదు.

4. బహిష్టు లో స్త్రీలు నిమ్మకాయ దీపాలను వెలిగించకూడదు.

5. నాలుగోరోజు స్నానంచేసి ఐదవరోజున ఈ నిమ్మకాయలతో దీపారాధన చేయరాదు.

## నువ్వులనూనె దీపారాధన

1. నువ్వులనూనె దీపారాధన చేసేటప్పుడు నువ్వులు నూనె ఎవరిచేతితో స్వీకరించరాదు. అన్నీ మీరే స్వయంగా తెచ్చి చేయాలి.

2. శుభకార్యాలు జరిగేటప్పుడు ఇంట్లో గుళ్ళోనైనా స్వామివారికి నువ్వులనూనె దీపారాధన చేయవచ్చును.

3. భార్య నిమ్మకాయలతో దీపారాధన చేస్తున్నప్పుడు భర్త నువ్వుల నూనె దీపారాధన చేయవచ్చును.

4. దీపారాధన చేసేటప్పుడు ఒకరికి బదులుగా ఇంకొకరు వెలిగించ వచ్చును.



5. నవగ్రహ దేవాలయాల్లో నువ్వుల నూనె దీపాన్ని వెలిగించి నప్పుడు శివలింగ దర్శనం చేసి తీర్థం తీసుకొనవలెను.

6. నువ్వులనూనె దీపాన్ని సాయంత్రం వెలిగించిన చాలా మంచిది.

7. భార్యావిహీనులు, వితంతువులు నువ్వులనూనె దీపాలను వెలిగించవచ్చును.

8. ఇంట్లోవారికి మైల, సూతకం ఉంటే నువ్వులనూనె దీపారాధన చేయరాదు.

9. భార్య ఇంట్లోకిరాని రోజులలో యజమాని నువ్వులనూనె దీపారాధన చేయరాదు. (భార్యని బయట ఉంచినచో దీపారాధన చేయవచ్చు)

## పిండి దీపం

ఈ దీపాలను వ్రతాలు చేసేసమయంలో అమ్మవారికి పిండితో చేసిన దీపాలను వెలిగిస్తారు. ఇలా చేయడం వల్ల స్త్రీలకు మాంగల్యభాగ్యం దేవీ అనుగ్రహం కలుగుతాయి.

## పిండితో దీపారాధన చేయడం వలన కలిగే ఫలితాలు

1. వట సావిత్రీదేవికి వ్రతం చేసేసమయంలో పిండితో దీపారాధనచేస్తే అన్నికష్టాలుతొలగి భర్తకు, సుఖసంతోషాలు లభిస్తాయి.

2. పిండితో దీపారాధన గౌరీదేవి ముందు వెలిగించి సుమంగళీ యోగం కలుగుతుంది.

3. ఉమామహేశ్వర స్వామివారి పూజ చేసేవారు పిండితో చేసిన దీపారాధన చేయటంవలన వారినిఅకాలమృత్యువునుండి తప్పిస్తారు.

4. పిండి దీపాన్ని మంగళగౌరిదేవి ఎవరయితే వెలిగిస్తారో వారికి మాంగల్య దోషాలు నివారించబడతాయి.

5. పిండితో చేసిన నాగుల జంట ఎదురుగా పిండితో దీపాలను వెలిగించి సర్పపూజచేస్తే వారికి, సర్పదోషాలు నుండి విముక్తి కలుగుతుంది.

## జలదీపం

ఒక చెంబులో సగం నీరు మిగిలిన సగం నూనె వేసి దీపారాధన చేస్తారు. దీనినే జలదీపం అంటారు. ఈ దీపాలు వెలిగించేవారికి మానసికసంతృప్తి కలుగుతుంది. ఈ దీపాలను ఎక్కువగా సాయంత్రం 6.30 తరువాతనే వెలిగించి, నదిలో లేదా నీటిలో వదులుతారు.

వీటిలో కూడా అనేక రకాలున్నాయి.

1. పత్రదీపం
2. పుష్పదీపం
3. నారికేళదీపం
4. హారతిదీపం
5. నదీతీరదీపం

## పత్రదీపం

ఆకులపైన చేసే దీపారాధనను పత్ర దీపారాధన అని అంటారు. వీటిలో కింద పడి వున్న ఆకులతో వ్రేళ్ళతో కూడా చేయరాదు. ఆకులపై దీపాలను వెలిగించి నీటిలో లేక నదిలో విడిచిపెడతారు.

1. తమలపాకుపై కర్పూరం లేదా వత్తులు పెట్టి దీపారాధన చేసి నదిలో వదలరాదు. (ఆంజనేయ స్వామి ప్రీతికరం కావున వీటిని వాడరాదు)



2. రావిచెట్టు ఆకులపై దీపారాధన చేసి నదిలో వదిలితే సర్ప దోషం తగులును.

3. బిల్వపత్రాలపై దీపారాధనచేసి నీటిలో వదిలితే శివ ఆగ్రహానికి కావలసివస్తుంది.

4. మర్రి చెట్టు ఆకులపై దీపారాధన చేసి నీటిలో వదిలితే త్రిమూర్తుల ఆగ్రహానికి గురి అవుతారు.

5. మేడిచెట్టు ఆకులపై దీపారాధనచేసి నీటిలో వదిలితే నరసింహ స్వామివారి ఆగ్రహానికి గురి కావలసి వస్తుంది.

6. మోదుగ ఆకులపై దీపారాధన చేసేవారికి అనారోగ్యము కలుగును.

7. నవగ్రహ వృక్షాల ఆకులపై దీపారాధన చేస్తే నవగ్రహ దేవతల క్రూరదృష్టికి గురి కావలసి వస్తుంది.

అందువలన ఆకులపై దీపారాధన చేసేవారు పైన సూచించిన ఆకులు కాకుండా మిగిలిన ఆకులను ఉపయోగించి పత్రదీపారాధన చేయగలరు.

## పుష్పదీపం

పూజానంతరం పువ్వుల దొంతరల దొంతరలగా పాత్రలుగా చేసి దానిలో నూనెవేసి, వత్తిని వెలిగించి దీపారాధన చేసి ఆ పుష్పములను నదిలో విడు స్తారో దానిని పుష్పదీపం అని అంటారు. దీని వలన జ్ఞానం సంప్రాప్తిస్తుంది.

## నారికేళదీపం

కొబ్బరికాయపై కర్పూరముతో దీపారాధన చేస్తారు. ఆ కొబ్బరి కాయని దిష్టితీసి పగలకొడతారు.

కొబ్బరికాయకొట్టి కొబ్బరిపై కర్పూరాన్ని ఉంచి వెలిగించి తమ ఇష్టదేవతలకు హారతి చేస్తారు. దీపాలను వెలిగించాలనుకునేవారు కొబ్బరికాయ వేరుగా కర్పూరం వేరుగాఉంచి వెలిగించి పూజచేస్తే దేవుని అనుగ్రహాన్ని పొందవచ్చును.

## హారతిదీపం

దీపాన్ని నదిఒడ్డున నుంచుని సాయంకాలంపూట భక్తిపూర్వకంగా చేస్తే జలదేవత లేదా పవిత్రనది ఆశీస్సులు ఎప్పటికి ఉంటాయి. నదీమతల్లికి పూజలు, ఉపచారాలుచేసి ఆ తరువాత హారతిఇస్తే సాక్షాత్ ఆ నదీదేవి అనుగ్రహం లభిస్తుంది.

నదిలో స్నానంచేసేటప్పుడు ముందుగా గంగానదిని మరియు ఏడు నదులను స్మరించి నదిదేవతలకు హారతి ఇస్తే వరుణలోకం సంప్రాప్తిస్తుంది. హారతి దీపాలను శాంతంగా వెలిగిస్తే మనస్సు నిర్మలమవుతుంది.

## తీర దీపం

ప్రవహించే నదీతీరంలో ఉన్నభూమిపై వెలిగించే దీపాన్ని తీరదీపం అంటారు. ప్రవహించే నీటికి దానిని ఆనుకొని ఉండే భూమిపై అక్కడ ఉండే బండపై లేదా నీటిలోదిగే సమయంలో ఉండే మెట్లపై లేదా నడిచే ప్రదేశంలో దీపాలను వెలిగించవచ్చును.

నదీ దేవతకు పూజ చేసే సమయంలో నదికి ఎదురుగా స్నానం చేయగలరు. స్నానం తరువాత పూజా విధులను పూర్తిచేసి నదీమ తల్లిని పూజించగలరు. రెండు పూజా దీపాలను ప్రక్కపక్కనే ఉంచి పూజించగలరు.

పూజ పూర్తి అయ్యేంతవరకు వరకుహారతి దీపాలు కొండెక్కరాదు. అలా కొండెక్కినచో పూజాఫలం, సంకల్పబలం నెరవేరదు.



తీర దీపాలను వెలిగించాలనుకునేవారు నది ఒడ్డున స్నానం చేసి పూజా సామాగ్రిని,పూజచేసే స్థలాన్ని శుభ్రంచేసి పూజ చేయాలి.

తీర దీపం చేసేటప్పుడు పూజా సామాగ్రిని ఎట్టి పరిస్థితుల్లోనూ దాటరాదు.

## నేతి దీపం

నేతితో దీపారాధన చేసేవారికి సకలపాపాలు పూర్తిగా తొలగి పోతాయి. దీపారాధనకు నెయ్యి తెల్లని వాడితే ఆ ఇల్లు సంతోషం, సుఖ శాంతులతో ఉండగలదు.

నెయ్యితోచేసే దీపారాధను దేవుని ముందు కూర్చుని వెలిగించ గలరు. ఇంట్లో వెన్నను కాచి ఆ నేతితో దేవునికి దీపాలు వెలిగిస్తే ఇంట్లో కోరుకున్నవన్నీ లభించి, లక్ష్మీకటాక్షాలు ఎల్లప్పుడు లభిస్తాయి. నేతితో చేసే దీపారాధన తూర్పు లేదా ఉత్తరం వైపుగా వెలిగించాలి. నేతితో చేసే దీపారాధన పశ్చిమం మరియు దక్షిణంవైపు వెలిగిస్తే అంత ఫలితముండదు.

1. అక్షయ తృతియ, ఉగాది, విజయదశమి, నేతితో దీపారాధన చేస్తే వారి కుటుంబ సభ్యులకు దేవతల అనుగ్రహం లభిస్తుంది.

2. నవరాత్రుల ఉత్సవాలలో దుర్గాదేవికి నేతితో దీపారాధన చేసి పూజ చేస్తారో వారికి శత్రువుల నుండి సమస్యలు తొలగి ఇంట్లో వారందరూ సుఖశాంతులతో ఉంటారు.

3. కృష్ణపక్షం, అమావాస్యనాడు, (దీపావళి అమావాస్య) సాయంకాలంనాడు గోధూళి లగ్నంలో శ్రీ మహాలక్ష్మీకి నేతితో దీపా రాధన చేసి తీపిపదార్థాలను నైవేద్యంగా పెట్టి చిన్న పిల్లలకు, బంధువు లకు, స్నేహితులకు పంచిపెడతారో వారికి వారి కుటుంబ సభ్యులకు సంవత్సరకాలమంతా దారిద్ర్యం పొడసూపదు.

